# జీవితాశ

రచయిత:

శ్రీ జంపన చంద్రశేఖరరావు
ఎమ్. ఎ., బి. ఇడి.,
అన్నామలై యూనివర్సిటీ,
అన్నామలై నగర్.



పబ్లిషర్:
చంద్రయ్యా అండ్ కో.,
పబ్లిషర్సు & బుక్సెల్లర్సు,
రాజమండ్రి.
1944

 [వెల రు. 0-8-0

# ఉద్దేశం.

గీ॥ మంచిచెడ్డల రెండింటి మధ్యమందు
పోవుచున్నది జీవిత నావనేడు ;
తీరమే చేరునో—ఏమొ ! చేరకుండ
పర్వతముతాకి ముక్కలై పగులునేమొ !

అనే ఆరాటంతో అల్లల్లాడిపోయాడొక వృద్ధుడు. అతని ఆకలి కడుపులో రేగే అగ్నిజ్వాలలకు ఆహుతి అయిపోయాడు...

" ఆకలంటూ, అన్నమంటూ, కేకలేసే, పెద్దపేగుకు,
దేవుడుంటే లాభమెంతో దెయ్యమున్నా లాభమంతే—
ఆకలి...కలి...ఆకలి..."

అంటూ అన్నపూర్ణ పళ్ళెంకోసం చేయిచాచేడు...పాపం ! ఎత్తినచేయి ఎత్తినట్లే కృశించిపోయింది...ఆకలిమంటతో కేకలేస్తూ—కాలరథంక్రింద శిథిలమైపోయాడు...

ఆ శిథిలజీవి విషాదజీవితం వర్ణించటమే...నా ఉద్దేశం...

N. B. :—ఆకలిబాధ ఎప్పుడైనా అనుభవించినవారే ఈ నవల చదవండి...లేకపోతే వద్దు...

శెలవు,
చంద్రం.

అంకితం—

కళాభిమాని ; విజ్ఞాని ; అయిన మా గురువుగారు,
శ్రీ గుద్దట తాతయ్యగారికి,
భక్తితో—చంద్రం.

రామ్సు ప్రెస్, రాజమండ్రి.

# 1

“ నాకు నమ్మకంలేదు ”

“... ... ...”

“ స్త్రీకి, హృదయంలేదు. స్త్రీజాతి కన్నా పిశాచజాతి మేలు ”

“ ఏమిటి ? ”

“ ఈ పిల్ల నా కుమార్తె కాదు. ”

“... ... ...”

“ నాకు స్పష్టంగా తెలుసు ”

“ ఎవరు చెప్పారు వీరా ? ”

“ ముంజేతి కంకణానికి అద్దమెందుకు ? ”

“ పొరబడుచున్నావు ”

“ అవును నిన్ను నా ప్రియురాలనుకుంటం పొరబాటే ”

“ చెప్పెడు మాటలు చెడ్డవి ”

“ చేసిన పనులు మంచివే ? ”

“ వీరా ! నన్ను అన్యథా తలుస్తున్నావు......నేను నీదాననే సుమా ! ”

“ నీవు నాదాననే కావచ్చు...”

“ మరి ”

“ ఈ పిల్ల మాత్రం నా కుమార్తె కాదు ”

“ ఎవరి కుమార్తె ? ”

"ఎవరికి తెలుసు ? నీవంటి కులటల చిత్తవృత్తి తెలుసు కుం టం ఎవరి తరం? కడుపునిండా విషం—కనులనిండా అమృతం మానవ జాతికి వేరు పురుగులు. మానవ నీతికి చాలిపురుగులు"

* * * *

ఎవరా పురుషుడు ?

ఆమె అతని భార్యయా ?

ఆ స్త్రీపురుషుల మాటలు నన్ను పగ్గాలతో పట్టి నిలిపాయి. వారిరువురు మేడపై మాట్లాడుకుంటున్నారు. మేడ క్రింద చెట్టు మా టున నేను నిలబడ్డాను.

వారెవరు ?

వారి భగ్నహృదయాలకు కారణ మెవరు ?

వారి జీవిత చరిత్రలు తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. ఆచెట్టుమాటునే నిలబడ్డాను.

* * * *

'వీరా ! ముందువెనుకలు ఆలోచించాలి"

"అన్నీ ఆలోచించాను"

"మంచి చెడ్డలను తరచాలి"

"తరిచాను..."

"అనుమానం ప్రాణహాని సుమా ?"

"అవును నీవో నేనో ఈరోజుతోసరి"

"మంచిచెడ్డలకు మన మనసులే ప్రమాణం—ప్రధానం"

"కాదని ఎవరన్నారు? స్త్రీల కొచ్చినన్ని శ్రీరంగ నీతులు ఎవరికి వచ్చును? నవ్వుతూనే ఉంటారు—నాశనం చేస్తూనే ఉంటారు. మాటాడుతూనే ఉంటారు—మంటలు కూరుస్తూనే ఉంటారు...ప్రణయాపాంగాలను ప్రసరిస్తూనే ఉంటారు—ప్రాణాలను తీస్తూనే ఉంటారు...అటువంటి స్త్రీ మూర్తులేకదూ లోకపూజితలు? త్రిలోకమాతలు?"

"వీరా! ఈ నీప్రియురాలు దురదృష్టవంతురాలు నన్నుచూచి నా బహిర్చేష్టలుచూచి—నన్ను నిందించిన నిందించవచ్చును...నా ప్రాణదాతవు కావున ప్రాణాలు తీయవచ్చును. అడ్డుపెట్టేవారులేరు. నీ ఆజ్ఞదాటేవారు లేరు...కాని స్త్రీజాతి అంతయు నిందార్హముకాదు సుమా!"

"నిందార్హులుకారూ?"

"సర్పములలోనూ ఉత్తములులేవా?"

"అహాహా! పాములన్నీ మంచివే...వానికోరలలో వేళ్ళుపెట్టిన చప్పరించును. తలదూర్చిన ముద్దుగొనును..."

"సర్పజాతికి చెందిన ఆదిశేషుని సహస్రఫణామండలంమీదే కదా మన భూమినిలబడింది?"

"ఆదిశేషుని తలమీద భూమినిలబడింది—నీతలమీద నాశక్తినిలబడుతుంది...పుక్కిటి పురాణాలను నమ్మేపురుషులుపోయి చాలకాలమయింది..."

పిచ్చిదానా! వేదపురాణాలను నమ్మిన జగత్తు వేయిసంవత్సరాల క్రితమే నశించింది...

"ఇప్పుడు భగవంతుని ఉనికికూడ సంశయించే కాలం ఆసన్నమయిందనుకుంటా..."

"భగవంతుడా? భగవంతుడుకూడ ఉన్నాడూ? ఉంటేనే నా ఈవ్యభిచారం? ఈదుష్కార్యం..."

"వీరా! తగిన నిదర్శనములు లేకుండా నన్ను నిందించటం న్యాయంకాదు...స్త్రీజాతి అంతా పాములకన్న హీనమైతే మనతల్లులూ మొదలైన వారంతా ఏమౌతారు? వారిగతీ అంతేకదూ?

"ఏమిటే పొగరు?...నాతల్లిని నిందిస్తున్నావుగా...దుర్మార్గురాల."

* * * *

అతనికి ఉద్రేకము ఆగలేదు..ఆయమపై కాలరుద్రుడులాగ దుమికాడు..."ధన్-ధన్" మను దెబ్బలు మాత్రం స్పష్టంగా విన్నాను. ఆమె జవాబు చెప్పలేదు. ఏడుపుకూడ వినబడలేదు—అయిదు నిముషములు వరకూ ఇద్దరూ మాటాడుకోలేదు.

అనుమాన పిశాచానికి గురియైన అతడే దుష్కార్యాన్ని చేసినా చేస్తాడు. ఆమెను అతని బారినుండి తప్పించాలి. అబలను రక్షించాలి. అనుకొన్నాను.

భార్యాభర్తలమధ్య నెవరి తలా దూర్చరాదు. అలాగని అన్యాయంగా ఒకానొక సోదరి మృత్యుముఖానికి గురిఅయితే చూస్తూ కూర్చుంటామా? ఏంచేస్తాం?

ఇది విషమ పరిస్థితి

నేనలాగే చెట్టుమాటున ఆ వింత ప్రపంచంలోని కదలికలు గమనిస్తూ నిలబడే ఉన్నాను...జీవచ్ఛవంలాగ...

* * * *

" వీరా! నామరణానికికూడ సంసిద్ధురాలనయ్యాను. నాప్రియుని చేతిలో మరణించే భాగ్యానికంటె నాకు కావలసిందేముంది? అంత కంటె పుణ్యమేముంది? స్వర్గసింహాసనాధిపత్యం లభించదూ?

వీరా? నామరణానికి నేను జడుస్తూన్నానని అనుకోక...దానికి నాకు విచారంలేదు. పుంస్త్రీగా (పుని స్త్రీస్త్రీ) చనిపోయి నందనోద్యానవనంలో పూలబాటలు పరస్తూ, తీయనిగీతాలు ఆలాపనజేస్తూ, నీ కొరకు ఎదురు త్రోవలుచూడటమే నాకానందం...

అయితే...ఒక్క-ప్రార్థన...

నా తప్పును నాచేత ఒప్పించి, నాగుక్కోడు ప్రాణాలునానుండి తప్పించు...వద్దంటే నేను నీ ప్రియురాలను కాదనుకో?"

" నీవు వైకుంఠరావుతో ఎంతచనువుగా ఉన్నావో నీకు జ్ఞాపకం ఉన్నాదా?"

" ఉన్నది...చాలా చనువుగా ఉన్నాను...అతడూ నీవలె బి.ఏ. లోనా 'క్లాసుమేటు' కదా?"

" అందుచేతే ఈ మనస్తాపము...కృపా! అతడు నిన్నెంతగా ప్రేమిస్తున్నాడో నీకు తెలుసా?"

" ఎందుకు తెలీదు వీరా! అతడిది మాది ఒకేఊరు, చిన్నప్పటి నుంచి నాకతడు తెలుసు...మా ఇరువురకు ఒకరంటేమరొకరికి ఎన్ని సంవత్సరాలునుంచే అనురాగం"

" అంత అనురాగంతో ఉన్న మీరిద్దరూ ఎందుకు వివాహం చేసుకోలేదు?"

" అదేం ప్రశ్నవీరా! అనురాగంతో ఉన్న వారందరినీ వివాహం చేసుకుంటమేనా స్త్రీధర్మం! మా అన్న కృష్ణునకు నామీద అనురాగంలేదూ? ఉన్నవారందరినీ వివాహం చేసుకుంటారా?"

"అందరినీ చేసుకోవచ్చును. వారిలో అతగాణ్ణి ఎందుకు చేసుకోలేదని నా ప్రశ్న."

"అతడిని నీవలె నేను సంసారిక దృష్టితో చూడలేదు. ఈ ప్రపంచంలో స్త్రీ ఎవరినో ఒక్కరినే ప్రియునిగా, ప్రాణాధిపతిగా చూడగలదు గాని, కనబడినవారితో స్నేహంచేసి వారందరినీ ప్రియులుగా ప్రేమించలేదు...అలా ప్రేమించినది స్త్రీయేకాదు."

'ఓహో!'

"వీరా! నమ్ము! నామాటవిను...నేనతనితో చనువుగా నున్నమాట వాస్తవమే...కాని నీవు భావించినట్లు తుచ్ఛంగా నేనెన్నడూ సంచరించలేదు...నామీద ఎవరో గిట్టక చెప్పిన మాటలనుబట్టి నన్యథా తలుస్తున్నావు. ఇది ధర్మంకాదు సుమా!"

"ఏమి నంగనాచివే..."

"... ... ..."

"ప్రత్యక్ష ప్రమాణాలనుకూడా కాదనగలవుగా!"

"ఏవీ! ప్రేలుమడచి ఒక్కటి చూపు."

"చూపిన."

"మరుమాట్లాడకుండా నాకంఠం నులిపి నాప్రాణాలు తీసివేయి. ఆనందంతో మరణిస్తాను..."

"అయితే ఇదిగో చూడు ఈ ఉత్తరం..."

ఆమె నిశ్చేష్టురాలై పోయింది. కన్నులు చెదిరిపోయాయి. చెమటలు గ్రమ్మాయి...నిట్టూర్పులు విడిచింది.

"ఎవరువ్రాశారో తెలుసా!"

"కొంచం సరీగాచూస్తే తెలుస్తూనేఉంది."

" ఎవరు ? "

" వ్రాసింది లీల...వైకుంఠరావు సంతకంపెట్టింది కూడ లీలే లాగుంది "

" లీలదనక ఎవరిదంటావు ? "

" వీరా ! ప్రతిఅక్షరం లీలదే...నేను లీలదని సిద్ధారణ చేయ లేనినాడు నన్ను నీయిష్టంవచ్చినట్లు చేయి. అంతవరకు నాకు వ్యవధి యివ్వవలసింది..."

" వ్యవధా—గివధా...అది వ్రాసింది వైకుంఠరావుకాదేం... దాంట్లోచూడు...మన పిల్లను జాగ్రత్తగా చూడు...అని వ్రాయ లేదా ? మన పిల్లట...మనపిల్ల...ఇటువంటి పాపపు సంతానంకన్న మీరేకదూ మహా పతివ్రతలు ?

దుర్మార్గురాలా ! తుచ్ఛురాలా ! "

" వీరా ! ఆలోచించు...ఎవరు కులటలో నీకే కొద్దిరోజులలో తెలుస్తుంది. ఒద్దిల్లోవుకాక...చదుకున్నవాడవు చదువుల్లో ప్రయోజనం గనపరచు...

" ఏం గనపరచాలి ? "

మీ నాన్నగారు కూడ మహాపతివ్రతే అయిన మీ తల్లిని అను మానించి—చంపారు...నిజం తెలిసిన తరువాత ఎంత పశ్చాత్తాప సంతప్తు లయ్యారు ? '

' నీకు తెలుసా ? '

' నేనాయనను చూడలేదు...ఆయన జీవితం ఇప్పటికీ ఇరుగు పొరుగువారు చెప్పుకుంటూ ఉండగా విన్నాను. ఆ విచారంతోనే ఆయన మరణించారట... '

‘ చాలు చాలు...ఎక్కువగా మాట్లాడక. ’

“ ఎలాగైనా ఈ కుతంత్రరచన లీలదే... ”

“ లీల కేం అవసరం ? ”

“ లీలనిన్ను ప్రేమించినది. ”

“ అవును. లీల నన్ను ప్రేమించినది. నీ వతనిని ప్రేమించావు... ఏ...దుర్మార్గురాలా ! ఇంకా మాట్లాడుతున్నావా ! ”

* * *

మరల పిడుగులవర్షం ప్రారంభం...ఈ పర్యాయం విస్తారం గానే ఉన్నాయి. అతని శక్తికొలదీ కొడుతున్నాడు—ఆమె ‘ ఉ...ఆ’ అనటంలేదు—తుదకు కొమ్మసిల్లిపోయిందనుకుంటాను...మూలుగు కూడా లేదు...కొట్టి...కొట్టీ...అతని ప్రాణంవిసిగి...

“ పాపీ ! నేనొచ్చేవరకు ఇక్కడే.పడువు... ”

ఆమాట అంటూనే మేడమెట్లమీదకు వచ్చి గభీలుమని తలుపు వేసేశాడు తాళంకూడా వేశాడేమో !...మెట్లు దిగుతున్నాడు... నన్నెక్కడ చూస్తాడో అనుకొని జడిశాను...కాని అతడతి ఉగ్రద శలో ఉన్నాడేమో ఇటూ అటూ చూడకుండా మేడమెట్లుదిగి చర చరా పెద్దబజారువైపుకు వెళ్ళిపోయాడు...

అతణ్ణిచూస్తే నా కెక్కడలేనికోపం వచ్చింది.

ఆమెను చూస్తే నాకెక్కడలేని జాలికలిగింది.

ఆమెను రక్షించాలనుకున్నాను...

ఎలా ?

ప్రయత్నించాలి.

అనుకుంటూనే బయలుదేరాను.

ఆహా! ఏమి ఈ సృష్టిమహాత్మ్యం, అనుమాన పిశాచానికి బానిస కానివా డుండడుకదా! ఉంటే వాడు మహాత్ముడే.

## 2

భయంకరమైన అర్ధరాత్రి గడచింది-

తేజోమూర్తియగు సూర్యభగవానుని రథాశ్వముల డెక్కలు కాబోలు, మేఘాంచలముల మీదనుంచి జారిపోతున్నాయి బ్రహ్మాండ మంతయు తేజోమూర్తియై, దృగంచలముల బంగరు కాంతులను దిద్దు కుంటూఉంది...

ప్రకృతిలో చైతన్యలక్ష్మి దివ్యనృత్యం పరిఢవిస్తూఉంది.

ప్రపంచం యథాప్రవృత్తికి పాల్పడింది.

విజన రజనిలోని నిర్మలత్వం ఇప్పుడులేదు.

ఇప్పటి చైతన్యం అప్పుడులేదు.

చీకటి వెలుతురులు—పాపపుణ్యాలు ఒకచోట కలిసి మెలసి ఉండవు...అయినా నాకంటే దగ్గర బంధువులు మరెవరూలేరు.

పగలు పగల్లా ప్రళయకాల మహాసముద్రమధ్యమున మునుగుతూ తేలుతూ ఉన్నవానిలాగ నాభావనా సముద్రంలో మునిగిపోయాను. ఆమె నెవరు? దోషియా? నిర్దోషియా? ఈలోపుగా ఆమె భర్త ఆమె ప్రాణాలు తీస్తాడేమో! ఆమెనెలాచూడ గలను? ఎలా రక్షించగలను?

ఆలోచనలపైన ఆలోచనలు
ఆలోచనలలోనే పగలు బ్రతుకు తెల్లవారింది

పగలెల్లా ఎక్కడ దాగి ఉందో తెలీదు...సాయం సమయం దాటగానే మృత్యువులాగ...కారుచీకటి తన వేయివేల ఇనుప పాదాలతో లోకంలో కి పరుగు పరుగునవచ్చింది—

యమునా నదీ శతసహస్ర వీచికాపరంపరల్లాగ—లోకమంతా చీకటి ముసుగులో లీనమయింది...

మరల అర్ధరాత్రి
యథాప్రకారం సముద్రంవైపు బయలుదేరాను
ఆమేడమీాద దీపం వెలుతురులేదు.
ఎవ్వరూ ఉన్నట్లుకూడా లేదు...
ఆమెనుచంపి వేశాడా !

శవాన్ని తీసుకు వెళ్ళిపోయిన తరువాత ఇల్లుల్లాగ... పాడుపడి పోయిన దేవాలయంలాగ—మృత్యుమందిరంలాగ ఉన్న ఆమేడను చూస్తూఉంటే నాహృదయం శతధావిభిన్నమై పోయింది.

పిడుగు పడితే మాడిపోయిన వృక్షంలాగ, నేనలాగే నిలబడి పోయూను

గంటసేపు నిలబడ్డాను
అలికిడిలేదు.
నాప్రాణాలు నిలువునా నీరై పోయాయి
ఏమాలోచక అలాగే సముద్రంవైపు బయలుదేరాను
అబ్బా ! ఆ అర్ధరాత్రి ఎంత భయంకరంగా ఉంది

మృత్యుదేవత ఇంకా భయంకరంగా ఉంటుంది కాబోలు

ఆ మృత్యుదేవత కౌగిలిలో ఆ అభాగిని నిదురపోతుందా ?

భావాలుపైన భావాలు

సముద్రం వంక చూస్తూ నిలబడ్డాను



అరగంట గడిచింది

నావెనుక ఏదో అలజడి కలిగింది—కాలిచప్పుడయింది—

ఎవరా అని వెనుకచూచాను

ఎవరది ?

నాహృదయం ఝల్లుమంది

నల్లకోక కట్టుకొని ఎవరో స్త్రీ...తన ఒడిలో ఏదో ధరించి, సముద్రమువైపు వస్తూఉంది...ఏదో ప్రమాదాన్ని తలపెట్టి నట్లుంది—ఆమె సంగతి కనుక్కోవాలనుకున్నాను.

"ఎవరుమీరు ?"

"... ... ..."

"ఇల్లా ఎక్కడికి ?"

"... ... ..."

"ఈ అర్ధరాత్రిలో..."

"... ... ..."

"సముద్రంవైపు వస్తున్నారే !"

"సముద్రానికి నాకు..."

"చెప్పమ్మా ! ఏమిటి ?"

4

"తీరని సంబంధం ఉంది—"

"అలా అంటున్నావేంతల్లీ!"

"ఆ సముద్రమే లేకపోతే నావంటి అభాగినుల హృదయాగ్ని చల్లార్చేదెవరు?"

"అంతే..."

"బాబూ! నాది వినలేని విషాదగాథ వినరాని విషప్లావితజీవితం"

"అదేమిటమ్మా!"

"మరువలేని మలినమైన బ్రతుకు...మరపురాని దళితమైన హృదయం"

"అందుచేత..."

"ఈ సముద్ర గర్భంలో నా పాపపు జీవితాన్ని పావనంచేసికుందామనుకున్నాను...పాపకలుషితమై, భగ భగామండే నా హృదయాగ్నిని చల్లార్చుకుందామనుకున్నాను...దయచేసి నామార్గానికి అడ్డురాకండి నా పవిత్ర భావాలను భగ్నంచేయకండి...నా ఆశయాలను నాశనం చేయకండి...నా..."

"అమ్మా! చాలు చాలు ఎంతపని తలపెట్టావు?"

"అదృష్టవంతురాలను కాబట్టే ఈ ఊహ నాకు తట్టింది"

"ప్రపంచంలోని ప్రాణికోటి కంతటికీ ప్రాణదాత ఆ భగవానుడు...మన మందరమూ ఆ పరమాత్ముని సంతానమే. కాబట్టి నీ బ్రతుకు బరువులు నేనుకొన్ని భరించాలి—భరిస్తాను...

"సానుభూతికి సంతోషం. మీమాట జవదాటి నందుకు క్షమించండి...శెలవు..."

ఆమె ముందుకు నడవ జొచ్చింది.

"నేనామెను వెన్నాడాను"

తలలపై మణులు మెరియుచున్న నల్లత్రాచుల్లాగ, నురగలు కక్కుకుంటూ తరంగాలు, సముద్రపు గట్టును కబళించివేస్తున్నాయి.

కన్ను మేరలోనుంచి సముద్రం కాలినడకకెంత ?

"అమ్మా !"

ఆమె మాటాడలేదు...

రూపు దాల్చిన శోకమూర్తిలాగ కదలిపోతూఉంది

నేను త్వరపడకపోతే ప్రమాదంతప్పదను

పెద్దంగలు వేశాను...

"ఆత్మహత్య మహాదోషమనుమా"

"... ... ..."

"నా మాటవినమ్మా ! సాహసం పనికిరాదునుమా ?"

"... ... ..."

అతిభీకరంగా ! సముద్రన్నే చూస్తూ ఆమె వెళ్ళిపోతూఉంది... మరో నిమిషానికి సముద్రంలో దూకివేస్తుంది...ఇంక లాభంలేదను కున్నాను—ఆమె ముందుకువెళ్ళి మహాపర్వతంలా నిలబడ్డాను...

"అమ్మా ! ప్రాణంకంటే తీపి ఈ ప్రపంచంలో లేదు. చచ్చి సాధించేదేముంది ? చావు పుట్టుకలను వెనుకా ముందు మన జీవితస్థితి మనకు తెలీదు. బ్రతికి ప్రపంచంలో చేయవలసిన పనులెన్నో ఉండగా, ఇలా ఆత్మహత్యచేసుకోవటం భగవదాజ్ఞకు వ్యతిరేకంగా నడవటం...చనిపోయిన తరువాత ఏమౌతామో ఎవ్వరికీ తెలీదు."

అమ్మా ! నీపైన ఆధారపడిన జీవితాలు ఒకటి, రెండైనా ఉండకుండా ఉండవు. వారిని ఉసురుపెట్టటం న్యాయమా ! వారిని కష్టపెట్టి

కన్నీరుకార్పించి, నీవు కాలసముద్రంలో కలసిపోవటం ధర్మమా తల్లీ. ”

ఆమె నిలబడిపోయింది.

అభిమానం నామాటలయందు కలిగి ఉండవచ్చు.

ఆమె అటు ఇటూ చూచింది.

‘ నాయనా !’ అని ఒక్కసారిఅరచి, వెక్కి వెక్కి ఏడ్వటం ప్రారంభించింది. వడిలోనున్న పాపాయి, కంచుగీచినట్లు శాపురుమంది...

తల్లి హృదయం జల్లుమంది.

నాకా బిడ్డకేక బళ్ళైవుపోటయింది.

“ అమ్మా! ఈ పాపాయితోటే నీవీ ప్రపంచయాత్ర ముగించుకుందామనుకున్నావా ?.”

‘అవును.’

“ఎంతప్రమాదం తలపెట్టావు తల్లీ! పాపాయి మొఖమైనా చూడలేదే...అయ్యోయ్యో! ఎంత వెఱ్ఱిబాగుల్దానవు తల్లీ! ”

“... ... ...”

మా ఇరువురి హృదయాలు బరువెక్కి పోయాయి.

నాలుగు నిమిషాలు మాట్లాడుకోలేపోయాం.

నాకా మేడసంగతి జ్ఞాపకంవచ్చింది...ఒక్క సారిగా ఆ అభాగ్యదంపతులిద్దరు కన్నులకు కట్టినట్లయింది. నే ననుకోకుండా నానోటి వెంటనుండి “ కృపా ” అని వచ్చింది. ఆమె ఉలిక్కిపడింది.

“ కృపా ? ”

“ మీరెవరు ? ”

“ నీభర్త వీరరాఘవరావు కదూ ! ”

“... ... ...”

"ఆశ్చర్యం ఎందుకు ? చెప్పు కృపా !"

"అవును. మీ కాయన తెలుసా."

"తెలియును. తెలియును."

"అలాగా..."

"నిన్న అనుమానించినది తెలియును. నిన్న రాత్రి నిన్ను కొట్టినదీ తెలియును. విద్యావంతులైకూడా, కొన్ని పర్యాయాలిట్లే కొందరు పశువులవుతారు. మానవత్వం వారిలో అప్పుడు మాయమవుతుంది. నిన్ను చంపటానికి ప్రయత్నించి నప్పుడా పశుత్వంకూడ పోయి, రాక్షసత్వం వస్తుంది. ప్రకృతిగుణాల ననుసరించి పోయేవాడు సామాన్యుడు తల్లీ...

చూడు తల్లీ ! ఈ కెరటాల మడతలమాటున ఎన్నివేల ప్రాణులు స్థిరనిద్ర పొందుతున్నాయో ఊహించగలమా ! ఎన్ని ప్రాణాలను ఆహుతి చేసినా ఈ సముద్రం ఎంత నిర్మలంగా—నిశ్చలంగా ఉన్నదో చూడమ్మా !

"అవును. పైకి ప్రపంచం చాలా శాంతంగా ఉంటుంది. లోపల మాత్రం విషం చలచలా మరుగుతూ ఉంటుంది."

"అలా లేనినాడు లోకాన్ని మోసగించగలరా ? తమ్ము తాము మోసగించుకో గలరా ?

"మీరేదో లోకానుభవంగల మహాత్ములులా కనబడుతున్నారు."

"లోకానుభవం ఉన్నంతమాత్రాన మహాత్ములు కారు తల్లీ. కలిగిన అనుభవం కార్యరూపం దాల్చినపుడే, జీవితానికి ఉత్తేజం—లేక పోతే నిస్తేజం."

"అవును. ఆచరణముఖ్యం. ఆశలుతీరని జీవితానికి కూడా ఆచరణ ముఖ్యం. అనురాగరసం ఇంకిపోయిన జీవితాలకుకూడా ఆచరణ ముఖ్యం. కాలచక్రంక్రింద నలిగిపోయే వాళ్ళకూ్కడా ఆచరణముఖ్యం"

ఆమె ఒక్క నిట్టూర్పు విడిచింది.

"అమ్మా ! ఏదీ ఆ పాపాయిని ఇలాగియి."

ఆమె మాట్లాడకుండా, తన ఒడిలోని పాపాయిని నాకిచ్చింది. పాపాయిని ఎత్తుకొన్నాను. నిరంతరం కాలిపోయే నా హృదయానికి హత్తుకొన్నాను.

సుధా స్రవంతిలాగ అనురాగం స్రవించింది...నా మోడుబెడద చిగురించింది...పుష్పించింది.

అబ్బా ! పాపాయి దెంతచక్కని శరీరం...

"అమ్మా ! బయలుదేరు...నా ఇల్లే నీ యిల్లు. నా ప్రాణమే నీ ప్రాణం...నేను మరణించికూడా నిన్ను బ్రతికించుకోగలను."

ప్రాణం...నేను మరణించికూడా నిన్ను బ్రతికించుకోగలను."

ఆమె మాట్లాడలేక పోయింది.

ఆలోచనల్లో మునిగిపోయింది.

"బయలుదేరాలి...చూడమ్మా ! చూడు. అటుచూడు. ఆ కారుచీకటిలో మునిగిపోయిన ఆ తూర్పుదిక్కునే తేజోమూర్తి ఉదయిస్తాడు. తన బాలారుణ కరములతో ప్రతి పూవునీ, ప్రతి మొక్కనీ, చక్కలిగింత పెడతాడు...ఆ పర్వత సానువులపై గడ్డిమొక్కలమీద కాంతి హీనములైన మంచుబిందులన్నీ, పగడాల్లా తళతళా మెరిసిపోతాయి...అదేమిటి. ఇదేమిటి—ప్రకృతి అంతా పరిత్యాణు పులకితమైపోతుంది. చైతన్యలక్ష్మి దివ్యానృత్యం చేస్తుంది...ఆదృశ్యం ఎంత బాగుంటుందనుకున్నావు ?

అఖండ తేజోస్వరూపమైన ప్రకృతిని చూడగలిగే తరుణం సమీపిస్తుంది. పదమ్మా...పద...పద...బ్రతుకులో ఎంతతీపివుంది...

ఈ లోకంలో ఆనందం అనుభవించనివారు, ఏలోకంలోనూ ఆనందం అనుభవించలేరు—

అసలు మన భారతభూమికంటే స్వర్గభూమి ఇంకేముందమ్మా! మన ఆనందలక్ష్మి మనచేతిలో చిరునవ్వుముత్యాల చిలుకరిస్తుంటే—కన్నెత్తి చూడకుండా కాలగర్భంలో కలసిపోవాలనుకుంటం ఎంత వెఱ్ఱి తల్లీ...

ఆశలన్నిటిలో— "జీవితాశ;"
రాగాలన్నిటిలో—"అనురాగం;"
కాంత లందరిలో—ప్రణయకాంత;
ఎంతతీపి!...ఎంతహాయి!...ఎంతమధురం?...

'అటువంటి జీవితాశ, ధృవతారలా నీముందు ప్రకాశిస్తూ ఉంటే—కాదని కాలగర్భంలో కలిసిపోతావా? పిచ్చి తల్లీ! పద...పద.. ప్రాణంకంటె తీపి ఏముంది? ఎవరు చచ్చిపోవాలనుకుంటారు...బయలుదేరు...రా! రా!'

ఆ మాటలతో ఆమె మంత్రముగ్ధ భుజంగిలానా వెనకాతే బయలుదేరింది...నాహృదయం తేరుకుంది. ఇద్దరం పాపాయితో మా పాతఇంటికి జేరాం.

"నాపొట్ట నేను గడుపుకోలేపోతున్నాను. వారిపొట్ట లెలా గడపటమో..." ఈ ఆలోచనతో నాకన్నులుమూతలు పడిపోతున్నాయి.

దీపానికికూడా దిక్కులేని మాదరిద్రచీకటి కొంపలోనే, మేము కన్నుమూశాము. అంతకంటే చేసేదేముందిలెండి...

♦ ♦ ♦ ♦

# 3

" కృపా నేను అంధజగత్తులో ఉన్నాను.

వెలుపలికి చూచినా, లోపలికి చూచినా, చీకటికోటుకే పూయబడిఉంది. కడుపులో మంటలు—కనులలో అశ్రువులు. ఈ మంటలా కన్నీటిని ఆహుతి చేయవాదో! ఆవిరిగా మార్చరాదో

జవశక్తుడుడిగిన వృద్ధుడను. కడుపు కాలుతోంది హృదయం కమిలిపోతూఉంది...కనులు వెల వెల బోతున్నాయి...ఏమిచేయ మంటుందీలోకం? పనిపాటలు...సరే...మంచిది...చేయాలి...చేస్తాను...ఏవీ పనిపాటలను చూపమను? ఎక్కడున్నాయి? ఎవరుచెపుతారు?

తిరుగవలెనంట...ఎంతదూరం?

పోవలెనంట...ఎక్కడకు?

అంతులు లేనిది అబ్ధి...అంతకు మించినది ఆకాశము...అతి విశాలమైన ఆకాశముకంటె మించినదీ అయోమయ జీవితం...ఈ అగాధ జీవితానికి ఒక ఒడ్డున నీవు—నేను—ఈ సృష్టిఅంతా నిలబడి ఉన్నాం...ఆవలిఒడ్డు చూపున కందదు...ఎంతదూరమో తెలియదు

ఎలా చేరతాం ? ఎంతకష్టం ? ఎంతప్రమాదం ? ఇలా ఎన్ని జన్మలు గడవాలో కదా తల్లీ ! ”

ఆమాటలు మాకృపతో అనుసరికి నాగొంతుకు గాద్గద్యంపొందింది. ప్రత్యవయవం ఒక వింతకదలిక కదిలింది—కన్నులు తేమగిల్లాయి.

“ తాతగారూ ! మీ జీవితాన్ని చూస్తూఉంటే నాకదేదో విచిత్రంగాఉంది. ఇంత సంస్కారం గలవారిని నేను చూడలేదనిపిస్తుంది ”

“ అలాగే ఉంటుంది. కంటితో ఎన్నో చూస్తూఉంటాం, అన్నీ జ్ఞాపకముండవు...కొత్తదృశ్యాలు తరుముకొస్తూ ఉంటే—పాతదృశ్యాలు మరో ప్రపంచంలో మటుమాయమైపోతూ ఉంటాయి...జీవితాశలు కొత్తవి పొడచూపుతూఉంటే పాతవి అడుగంటుతూ ఉంటాయి. కొత్తకెరటం ముందుకు వస్తూఉంటే, పాతకెరటం వెనక్కిపోతూ ఉంటుంది...కొత్తమొగ్గ పూవుగా వికసించబోతూఉంటే—పాతపువ్వు పరిమళాన్ని గోల్పోయి రాలిపోతుంది.

కొత్తవానికి స్థానం ఈయటం పాతవాని లక్షణం. అది సహజ ప్రకృతిధర్మం.

“ అలాగేఉంది చూస్తూఉంటే వేదకాలం నాటి సాంప్రదాయం పురాణ కాలంనాటికిలేదు. పురాణ కాలంనాటి సాంప్రదాయం నేడు లేదు. నేటి సాంప్రదాయం ఇకముందు ఉండదు...అబ్బా ! కాలం ఎంత తీవ్రంగా మారిపోతూంది ”

“ కృపా ! మన మనస్సులు మారిపోవటంలేదూ ! మన మనో ప్రవృత్తినిబట్టే కాలం మారిపోతుంది. ”

"ఇది మంచికే మారుతుందో—చెడ్డకే మారుతుందో తెలియటంలేదు."

"కాలం ఎంతమారినా, ఎంత మారకపోయినా మంచిచెడ్డల కలియకలేనిదే ఎప్పుడూ ఉండదు."

కృప ఆలోచనలలో పడిపోయింది...

నా హృదయంలో మడతలు మడతలుగా ఆవరించుకొన్న భావనా పరంపరలన్నీ విప్పి, ఆమె కనులముందు వినీలాకాశంలా పరిస్తే ఆమె చూడలేదు. చూచి సహించలేదు... నాధోరణిమార్చాలనుకున్నాను.

"కృపా! భోజనాలుచేద్దామా? అప్పుడే రాత్రి 9 గంటలు కావచ్చింది."

"... ... ..."

"మాట్లాడవేం కృపా!"

"... ... ..."

"వంటచేయలేదా?"

"అప్పు ఎక్కడా దొరకలేదు"

"మధ్యాహ్నంకూడా మనం భోజనంచేయలేదు, పాపం నావల్ల నీవుగూడా ఉపవాసముల మాడిపోతున్నావు. అగ్నిసావాసంచేసే బంగారానికి సుత్తిదెబ్బతప్పుతుందా?"

"అలా అనకండి మీ ఆదరణచేతే నేనింతకాలం బ్రతికి మంచి చెడ్డలను తెలుసుకో గలిగాను"

"అమ్మా? మంచి చెడ్డలను తెలుసుకొన్నంత మాత్రం ప్రయోజనం ఏముంది? ఆచరించటంవలన ప్రయోజనముంటే . ఉండవచ్చును.

ఆచరించటం ఎలా ? జీవయాత్ర నిర్వహించుకొంటానికి తగినంత ఆహా రమైనా మనం సంపాదించుకోలేక పోతున్నాం కదా ?......మంచిది మంచిది. మన హృదయాలలోనే భగవానుని మంగళ హారతి మంటలు

"కృపా! పాపాయికైన పాలు దొరికాయా ?"

"... ... ..."

"లేదా !"

"లేదు..."

"మరెలా !"

"భగవంతు డున్నాడు"

"భగవంతుడు మన వంటి పాపులపాలిట లేడు,"

"మనమేమి పాపముచేశాం..."

"బానిస దేశంలో బ్రతికి ఉండటమే"

"బ్రతికి ఉండుట విధి ఆజ్ఞ కాబోలు..."

"విధి—విధి—అంతావిధే—"

నాకన్నులు చింతనిప్పుల్లాగ ఎఱ్ఱవారాయి పాలులేని పాపాయిని చూచేసరికి, నా హృదయంలో ఎఱ్ఱగా కాల్చిన నాగలిమొన పైకి లాగబడినట్లయింది—

దరిద్రదేవత తన నల్లనిచేతులతో నన్నెదో మరో ప్రపంచం లోనికి రమ్మన్నట్లు పిలుస్తుంది. నల్లత్రాచులు కాబోలు తమ ఎఱ్ఱని నాల్కలు చాచి, నన్ను పరిహాసము చేస్తున్నాయి లోకం పైనుంచొని తాడిప్రమాణం తలనెత్తి కాటువేయబోవు మహాసర్పంలాగ, ప్రళ యసముద్రం మిన్నులు ముట్టుతూ నన్ను మింగటానికి వస్తూఉంది"

"కృపా! ఇవాళకు భోజనంలేదు. రేపెలా? ఎల్లుండెలా? పని కొరకు తిరిగాను దొరకలేదు. అప్పుకొరకు అడిగాను ఎవ్వరూ ఈయు లేదు. ఇల్లుచేరాను. భోజనం ఎలావస్తుంది?"

కృపా! మనది బానిసదేశం. మన బ్రతుకు బానిస బ్రతుకు"

"మీరూ నేనూ అనుకుంటే ప్రయోజనమేముంది?"

"ఏమీలేదు. ప్రతియింటా కొందరు మనలా నిరాశలో నిలచి పోవాలి. ఆకలికి ఎండిపోవాలి ఎండిన వారి హృదయాలు పండిపో వాలి. అంతవరకూ ఈ బానిస బ్రతుకు మాసిపోదు"

ఇరువ్రుగం ఎవరి గదిలోకి వాళ్ళం వెళ్ళిపోయాం.

చీకటిని చీల్చి వేయటానికి దీపం కావాలి. దీపానికి నూనికావాలి నూనెకు డబ్బేది?

చీకటిలోనే పాపాయిని పొత్తికడుపులో పెట్టుకొని కన్నతల్లి కన్ను మూసింది. నిదురపోతుందో లేదో ఆభగవాను డెరుగు? అయినా ఎలా నిదురపోతుంది? కడుపుమంట చల్లారితేగా...

రాత్రి పదకొండు గంటలు కొట్టారు
విన్నాను...హృదయం చలించింది
రాత్రి పన్నెండు గంటలు కొట్టారు
విన్నాను...శరీరం జలదరించిపోయింది...
ఆకలి మంటకు ఆగలేకపోయాను...

పాలులేకపోతే పాపాయి చచ్చిపోతుంది పాపాయి చచ్చిపోతే బెంగపెట్టుకొని తల్లి చచ్చిపోతుంది...తినటానికి తిండిలేక మేమింత తులమల మాడిపోతుంటే—తిన్నది అరగక ధనికులు బాధపడటమా? ఏమి న్యాయం? ఇదే కాబోలు ప్రపంచ ధర్మం—?

అంతా భగవంతుని సంతానమైనపుడు కొందరు సుఖించటం ఏమిటి? కొందరు దుఃఖించటం ఏమిటి? ఈధనికులంతా లక్షాధికారు లెలా అయ్యారు? మా నెచ్చటి రక్తం పీల్చేకదూ? మాకన్నులలో ఆనందం దొంగిలించేకదూ?...సరే...సరే

నేను మాత్రం వారిరక్తాన్ని ఎందుకు పీల్చరాదు. కాలే కడుపును ఎందుకు చల్లార్చకూడదు? కారే కన్నీటిని ఎందుకు తుడుచుకోరాదు?

మా గోతులు మేము తవ్వుకోవాలా? మా సమాధులు మేము కట్టుకోవాలా? మా సమాధులమీద మేముకన్నీరు కార్చాలా? మా మోడుజీవితాలే వానికి నీడనివ్వాలా?

నాశరీరంలో ఉప్పొంగే ప్రతిరక్త కణంలోను దరిద్రదేవత వికటాట్టహాసమే ప్రతిధ్వనించింది. నేను అడుగుతీసి అడుగువేసేసరికి మృత్యుదేవత తన వికృత క్రూరక్షుధాక్షుభిత కరాళ కఠోర భయంకర వక్త్రం తెరచి, విషజ్వాలలు వెలిక్రక్కుతూఉంది...నన్ను నాకుటుంబాన్ని దహించటానికి అంత వెలుతురు కావాలి కాబోలు....

నేను వణికి పోతున్నాను

నాయెదుట చిక్కిపోయి, సగం చచ్చిపోయి, కృశించిపోయి, కుళ్ళిపోతున్న ఆశాదేవత మాత్రం చీకటి ముసుగులోనే కన్నీరుకారుస్తుంది...నా హృదయం రాయిపడిన నీరులాగ చీలిపోయింది.

ఆశాదేవత నావంక దీనంగా చూచింది.

అక్కడ నిలబడలేక పోయాను

జీవితాంధకారంలో ఆశాజ్యోతిని వెలిగించాలి...దశదిశలా జ్యోతిర్మయంచెయ్యాలి...ప్రపంచపు అంచులమీదనే పరుగెడతాను...

ఆశాజ్యోతి ఆరిపోయేవరకు పరుగెడతాను...హృదయంలో రక్తంచల్ల బడిపోయేవరకు పరుగెడతాను పరుగెడతాను—ఎక్కడో పడిపోతాను భూమిలో కలిసిపోతాను...అప్పుడు నా జీవితాశ ఏమౌతుందో! నా జీవనజ్యోతి ఏమౌతుందో! నాదరిద్రదేవత ఎవరివంకచూచి వికటబడి నవ్వుతుందో! అహ్హాహ్హా!......అహ్హాహ్హా......అహ్హాహ్హా.

*   *   *   *

## 4

ఆకలి—ఆకలి.

ఆకలికడుపులో—అగ్నిజ్వాలలు.

ఆశాకిరణం—ఆహుతి అయింది...

అగ్నిపర్వతాల—భుగభుగ మంటలు...

అనాథజీవుల—ఆర్తనాదం...

అగ్నివర్షం—అగ్నివర్షం...

ధగధగ కాంతులు—భగభగ కాంతులు...

ప్రళయం—ప్రళయం...

ప్రళయంలో ఈ ప్రపంచం కలసిపోవాలి...సముద్రకెరటాల పైన ఈ కోటీశ్వరుల ధనరాసులు తేలిపోవాలి...బూజుపట్టిన వారి జీవితాలు కడగబడాలి...

అప్పుడేశాంతి—అపుడేదాంతి...

అందాకలేదు—విశ్రాంతి...

బయలుదేరాను...వెళ్ళిపోతున్నాను...డబ్బు కావాలి... పాపాయికి పాలు తేవాలి...మాకడుపులు చల్లబడాలి...

కర్తవ్యం ఏమిటి ?

మార్గం ఏముంది ?

దొరతనం—పోవాలి.

దొంగతనం—కావాలి..

దొంగతనమా ? ఛీ. ఛీ. అంతకంటే నీచమేముంది ?...ఒకరికి చేయిచాచి ముష్టెత్తరాదూ ? ముష్టా—ముష్టి...ముష్టి ఎవరు పెడతారు ? ముష్టికి చేయిచాస్తే—తూగుటుయ్యాలలోనుంచే జవాబు వస్తుంది—పనిపాటలు చూచుకోరాదా ? అని...పనిపాటలు లేవు బాబూ...అంటే...చావమంటారు ?

చావాలా ?—చావాలా ?

ధనికులు.

బ్రతకాలా ?—బ్రతకాలా ?

దరిద్రులు.

పోవాలా ?—పోవాలా ?

ఈ ప్రశ్నలకు జవాబులు తెలుసుకుంటూవుంటే—నా హృదయం ముండ్లకంపలమీదనుంచి లాగినట్లుంది...

అ అర్ధరాత్రిలో కదలే శవంలాగ వెళ్ళిపోతున్నాను— ద్రోంగతనానికి.

ఎక్కడకో—

ఏమిటో—

నాకే అర్థంకావటంలేదు...

వెళ్ళిపోతున్నాను...వెళ్ళిపోతున్నాను...

పర్వతంతాకి నాతల ముక్కముక్క లై పోయేవరకూ వెళ్ళి పోతాను.

*　*　*　*

అది పెద్దమేడ...

పై అంతస్తుమీద లయిటు వెలుగుతూఉంది...

ఆలయిటు కాంతులు నాకు స్పష్టంగా కనబడుతూ ఉన్నాయి..

ధృవతారను చూస్తూ పడవ నడిపే నావికునిలాగ—ఆ నక్షత్రం చూస్తూ మేడ మీద నీరుపోయేగొట్టం పట్టి ఎక్కిపోయాను...

మేడమీద గదితలుపు నాకొరకే గాబోలు ఎవరో తెరచి ఉంచారు.

గదిగుమ్మం దాటాను

నాకళ్ళు చెదిరిపోయాయి

ఎవర్లో యువతీ యువకులు మాట్లాడుకుంటూ ఉన్నారు

ఆ తలుపుచాటునే నక్కి——శవంలాగ నిలబడి ఉన్నాను...

*　*　*

" ఇందిరా ! డబ్బు అవసరం లేకపోతే అడుగుతానా ? "

" అంత అవసరమా మోహన్ ! "

" కాదుమరీ "

" అలాగైతే నా చంద్రహారం ఇదిగో తీసుకో "

" చంద్రహారమే...అడిగితే...

"పరవాలేదు తీసుకువెళుదూ...నీకంటే నాకీ ప్రపంచంలో ఎవరున్నారు? అడిగితే ఎవరో ఎత్తుకుపోయారంటా...దానికేమిట్లే"

"సరే...ఇవ్వు..."

"ఇచ్చేముందు ఒక్కసారి..."

"ఏమిటి?"

"ఒక్కటి..."

*　*　*　*

వారిద్దరు కౌగిలించుకున్నారు

ఆ దృశ్యాన్ని చూస్తూఉంటే నా హృదయం బ్రద్దలయింది. గొప్పవారి కంబళీలో ఎన్ని పాములైనా...నిదరపోతాయి ఎన్ని తేళ్లైనా దాగుంటాయి...వారే పాపకృత్యం చేసినా...బంగారపు రేకుల మాటున దాయగలరు...

కాని

మావంటి పేదవా కేచిలిపిచేష్టనైనా చేయనీయి...సంఘం బహిష్కరిస్తుంది...ప్రభుత్వం శిక్షిస్తుంది...

ఏమిసంఘమో—ఏమి ప్రభుత్వమో

అతని కామె చంద్రహారాన్నిచ్చింది...సర్పాన్ని జేబులో వేసుకున్నట్లు దానిని జేబులో వేసుకొని గదిదాట బోయాడు...

వెధవ చోరత్వం అలవాటులేదేమో...అతనిని చూచేసరికి నాశరీరం వణకటం బయలు దేరింది...నాచేతులు వణుకుతూ తలుపు మీద ఆనాయి. దానితో తలుపు జరిగింది...చప్పుడయింది.

ఇద్దరూ ఒక్క మారుగా మూలవణికే నన్ను జూచారు...... వెంటనే...

"దొంగ... దొంగ..."

అని ఎల్గెత్తి అరిచారు—

ఆ యువకుడు అదే సందని కాలికి బుద్ధిచెప్పాడు...

వెంటనే నలుగురూ నాచుట్టూ మూగారు...

"ఓరి ముసలి ముండాకొడుకా! నీకూ దొంగ తనమే"

అంటూ ఎముకలు విరగొట్టారు—

పారిపోవడానికైనా ప్రయత్నించలేని నాపైన పిడుగుల వర్షం కురిపించారు.

చేసిన తప్పుకు శిక్ష అనుభవించవద్దూ—

అనుభవిస్తాను...

శాంతిగా అనుభవిస్తాను—

నలుగురూ జేరి నన్ను యమకింకరుల వంటి పోలీసులకు అప్ప జెప్పారు.

ఆమె చంద్రహారాలు నేనే అపహరించానని...నా దొంగల జట్టులో వాళ్ళకి ఆ డబ్బిచ్చాననీ నేరారోపణజేశారు...

గొప్పవారెంతకైనా సమర్థులు.

నేను దొంగిలించ లేదంటే నమ్ముతారా?

ఆమె రంకుటాలంటే వింటారా?

ఎన్నడూ జరుగని విషయం అది.

నన్ను ఇనుపఊచల పంజరంలో—చిలుకలా బంధించారు.

వారిశక్తికొలది లాఠీలతో కొట్టారు.

ఎన్నయినా చేస్తారు?

ప్రభువులు—గొప్పవారు—చేయలేని విషయాలు యేముంటాయి-దాయలేని రహస్యాలేముంటాయి వారి సృష్టికర్తకంటే వేయిమడుగులు ఎక్కువ చదువు కున్నారు; అసాధ్యులు.

ఆ జెయిలు ఇనుప ఊచలు చేత్తో పట్టుకొని—చీలిపోయిన ఆకాశాన్నంతా చూస్తున్నాను...బోనులో బంధింపబడ్డ సింహం; పంజరంలో బంధివ బడ్డ చిలుక; అనుభవించే కష్టంనాకు అనుభవంలోనికి వచ్చింది.

లాభమేముంది?

ఆకలి మంటను చల్లార్చుకుందామని బయలుదేరాను

అదృష్టవంతుడను...

కడుపు మంట చల్లార్చుతుంది...

నాకీశిక్ష ఎన్ని సంవత్సరాలు విధిస్తే అంతమంచిది

కాని—

నా కృపకెలా? పాపాయికెలా?

ఎవరి సద్దరిసి సముద్రగర్భంలో • రెండుకోటాల క్రింద్దనైనా కలిసి పోనీయలేదు. వారిక్కుదాగ్నులు ఆనాటితోనైనా చల్లారేవి... వారి దరిద్ర విషాద జీవితగాధ లానాటితోనైనా ముగిసేవి.

కాని—

వారిని మహోద్ధరించే వానిలాగ—హితబోధచేసి ఇంటికి తీసుకు వచ్చాను...

ఇప్పుడు వారి గతేమిటి?

మలమలమాడి చావటమేనా?

అయ్యో! భగవంతుడా ఎంతచేసావురా నాయనా!

అనుకుంటూ నరకబడిన కొమ్మలాగ నేలమీద ఒరిగిపోయాను. ఆ ఇనుపచువ్వలకు జేరబడి కారు చీకటినిచూస్తూ కన్నుమూశాను...

ఎప్పుడో చిన్న కునుకుపట్టింది—

అంతే—

అప్పుడే బరువుగాఉన్న నాకనురెప్పలు తెరువ బడ్డాయి— ఈ ప్రపంచం అంతా ఈ నల్లని చీకటిలో ఎంతనిశ్శబ్దంగాఉందో! లోపల ఎన్నికడుపులు ఆకలితో మలమలా మాడిపోతున్నాయో! నా ఆకలి పేగులు అరిచాయి—

ఏమీ తోయక చిన్నగొంతుకుతో పాట ప్రారంభించాను.

గీతం :—

"ఆకలంటూ

అన్నమంటూ—

కేకలేసే

పెద్దపేగుకు,

దయ్యమింకేం

లాభమెంతో—

దైవమున్నా

లాభమంతే!

మింటి కంటెడు

కడుపు మంటను.

ఆర్పలేని

కంటి నీటికి___

అన్నపూర్ణా

పళ్ళెరంబున

సున్నమంటే,

లాభమెంతో___

అన్నమున్నా,

లాభమంతే !!

కాలవాహిని

గర్భమందూ

కలిసిపోయే

కటికిపేదకు

రాళ్ళగుట్టల

లాభమెంతో

రాజులున్నా

లాభమంతే !!

“ బాబూ ! ఏంటాపాట ? ”

నన్నుకూడా పలుకరించేప్రాణి ఈ ప్రపంచంలో ఎవరున్నారా ? అని తలెత్తిచూచాను...

నాలాగ పనికిపాటులు పడుతూ—పాటవింటూ—జాలిపడే వయసు మరలబోయే పోలీసు కానిస్టేబులు...

"తమ్ముడూ ! నాపాట వింటున్నావా ?"

"అవును బాబయ్యా ! ఎంతబాగుందనుకున్నారు...మాచెవులి కెప్పుడూ బూతుపాటలేగాని—ఇటువంటి మంచిపాట లెప్పుడూ వినిపించ లేదుబాబు...అబ్బా ! ఆకలిమంటను ఎంతబాగా చెప్పారండి."

"ఉద్యోగంలోఉన్న మీకూ ఆకలి బాధేనా ?"

"లోకంలోఉన్న ఆకలంతా మాకడుపులో ఉండక, కులవృత్తులు చేసుకొనేవారి కుంటుందాఅండీ !"

"బాగా చెప్పావు...అయితే నిలవేమీ వేయలేదూ !"

"నిలవకూడానా బాబూ ! లంచం దొరికినకొద్దీ తాగడం ఎక్కువవుతుంది. పాడుమూక కదండీ బాబూ స్నేహితులు."

"అయ్యోపాపం ! అన్యాయార్జితం పరులపాలు కావలసిందే."

"అందుకనే బాబు ఇప్పుడు అఘోరిస్తూ ఉన్నాను. పెళ్ళీడు వచ్చిన ఆడపిల్లలిద్దరున్నారు... ముప్పైఏండ్లు దాటిన ఇద్దరు కొడుకులున్నారు."

"అయ్యో ! వారేం చేస్తున్నారు.

"ఒకడు కారుడ్రయివరు...మారొకడు మిల్లుకూలీ...ఇద్దరూ కలసి పదకొండు రూపాయల జీతమైనా, ఇచ్చేది అయిదో ఆరో...ఏ నెల కానెల అప్పులతో మిగులుతున్నాం..."

"బాగుంది..."

"బాబూ ! తిండికి డబ్బుచాలక బిడ్డలకుపెట్టి. నేనూ నాభార్యా పస్తున్నరోజులు చాలా ఉన్నాయి. అవన్నీ తలుచుకుంటే నా గుండె

సముద్రం అయిపోతుంది. ఆ ఆకలి కడుపుతో అలాగే కుమిలి కుమిలి ఏడ్చేవాళ్ళం. రేపో మాపో పిచ్చినీ ఇస్తారు... తరువాత మాగతి దేముడెరుగును బాబు."

ఆమాటంటూఉంటే ఆకానిస్టేబులు గొంతుకు బొంగురుపోయింది...పాపం! కన్నీరుకూడా కారుతూ...ఉండొచ్చు—

"తమ్ముడూ! ఆకలిబాధకు ఆహుతికాని ప్రాణి అరుదు. అది మనలోపం ఏముంది నాయనా?"

"ఎవరిలోపం బాబయ్యా!"

"ప్రభుత్వలోపం..."

"మన కులవృత్తి మనంచేసుకుంటే...వారొద్దన్నారటండీ!"

"నిజం...నిజం..."

"మాతాతకు పదిజతల ఎద్దులు...మూడుబళ్ళు...ఇరవై ఎకరాల భూమి ఉండేదిబాబు...మా నాన్నంతా పాడుచేసి...మాకీగాత తెచ్చాడు. ఇంతకూ అంతా కర్మలే బాబు..."

"కర్మ...కర్మేమిటి? అదంతా మన కల్పితం...కర్మేమీ లేదు. ఉన్నా బహుస్వల్పం...మనకు దానితో ప్రయోజనం ఏమీ లేదు."

"కర్మ కాపోతే బంగారంవంటి బాబులు మీరు మీకీగతి ఏమిటండీ!"

"దొంగతనం కాక...ఇలా దొరికిపోయాను...ఇది నాలోనే ఉంది...దాని దొంగతనంగురించి—ఆకలి వొందరపెట్టిందని బయలు దేరటం తప్పునాదేకదూ!"

"మీరేం కాదుబాబు... మీరు పాటిస్తున్నా... మీమాటలింటున్నా మీరేదో మహాత్ముల్లాగ కనబడతారు బాబయ్యా! కాని... మీరెన్నైనా చెప్పండి...పూర్వజన్మ పుణ్యపాపాలమీదే మనబ్రతుకంతా ఏర్పడి ఉందండి..."

"తమ్ముడూ! మన పూర్వులు మనకు ఆకలిదప్పులు తీర్చే మార్గం చూపించలేదు కాని...తేజోసంతమైన జీవితాన్ని నిస్తేజంచేసే మార్గాలు చూపించారు...మన పాదాలమీద మనం నిలబడలేకుండా మన భావాలనుబట్టి మనం నడవలేకుండా-ప్రతిపనికీ కారణం కల్పించారు...ఏమిటది? అదేకర్మ...

పుట్టినప్పటినుంచి గిట్టేవరకు;
నిదుర లేచినప్పటినుంచి నిదుర పోయేవరకు;
మనం మంచే చేయనీయి...చెడ్డే చేయనీయి
దానికి కారణభూతం ఎవరు?
"కర్మ..."కర్మ"
ఈ సృష్టిరథాన్ని నడిపించేదే 'కర్మ'...అంతా 'కర్మే'
అయితే మన పనేముందో!
మనకు రాళ్ళకు భేదం ఏముందో!

"అలాగేనండి. అలాగే...మనపెద్దలు చెప్పారు...అదే మనం చేస్తున్నాం"

"తమ్ముడూ! ఒక్కమాట చెబుతావిను...

మన పూర్వనాటి సంఘంవేరు. ఆనాటి సంఘానుసరణంగా వారు సంఘ నిబంధనలు ఏర్పరచుకున్నారు...ఈనాటి సంఘంవేరు. అటువంటప్పుడు మనకు వీలైన నిబంధనలు మనం ఏర్పరచుకోవద్దూ!"

" అవునవును. "

" నాడు ప్రజలు కొద్దిమంది. దేశం అనంతం...స్వరాజ పరిపాలన—నేడో ప్రజలు తండోపతండాలు...దేశం పరదేశీయులవాసం...పరరాజపాలన...

ఎంతమార్పో చూడు...

నాడు కులమత భేదములవలన దేశం ఉత్తేజవంతం అయింది. నేడు కులమత భేదాలవలన దేశం నిస్తేజం అవుతూంది. నాడు రాజులు మంత్రులు మొదలైనవారే ధనాధిపతులు—నేడో పెక్కురు.

నాడు ఆకలిమంటల కేప్రాణీ దగ్ధంకాలేదు.

నేడో ప్రతిప్రాణీ దగ్ధం అయిపోతూఉంది.

నాడు స్వతంత్రదేశం.

నేడు బానిసదేశం.

" అవును బాబూ ! కాలంమారిపోయింది—"

" ఇంకా మారిపోవాలి—ఇంకా మారిపోవాలి "

నేనింక మాట్లాడలేకపోయాను—ఆమాటలంటూనే ఆఖయిదులో మరోమూలకు పోయి కూలిపోయాను.

* * * *

# 5

తెల్లవారింది.

సబ్ ఇనస్పెక్టరుగారు వచ్చారు.

క్రొత్త ఖయిదీనగు నన్ను చూపించటానికి వారు తలుపులు తీశారు.

నన్నతడు చూచాడు...

అతడాశ్చర్య పోయాడు...

"ఎవరది ?"

"బాబూ !"

"మీరా !"

"బాబూ !"

నా పెద్దగడ్డంలో దాగున్న పెదెములు ఒక వింతకదిలిక కదిలాయి...జీర్ణించి—లోతుకు పోయిన నా పెదెములలో ఒక తేజోరేఖ మెరిసింది...

అక్కడే వారాశ్చర్యపోయారు...మమ్మల్ని చూచి.

సబ్ ఇనస్పెక్టర్ తలవంచుకొని...చెర చెరావెళ్ళి కుర్చీలో కూలబడి పోయాడు...

నేనలాగేచూస్తూ నిలబడిపోయాను...

అతణ్ణి చూచేసరికి నాహృదయం బ్రద్దలై పోయింది.

నాకనులు నిండిననీరు జలజలా జారిపోయింది...

మా యిద్దరికూగల సంబంధం ఏమిటా అని మిగిలిన వారంతా అశ్చర్యపోతూ చూస్తున్నారు...

" అబ్బా ! ఎంతకాలానికి చూచాను. "

అనే మాటలు నాకు తెలియకుండానే నానోటినుండి వెలువడ్డాయి...దానితో వారికన్నులన్నీ ఒక్క సారిగా నావైపు— మా సబ్ ఇన స్పెక్టర్ వైపు త్రిప్పారు.

నేనక్కడ ఒక్క నిముషంకూడా నిలబడలేపోయాను.

నావిషాదగాథ తలుచుకొనో—నా ముఖం చూడలేకో అతడు వెంటనే సైకిలెక్కి ఏమీ ఎవ్వరితోనూ చెప్పకుండానే వెళ్ళి పోయాడు...

దానితో అక్కడున్న వారికి అనుమానం మరింత ఎక్కువై పోయింది...

ఏమిటో—జీవితంఅంతా చిత్రంగానే ఉంది...

*   *   *   *

అది అర్ధరాత్రి.

నాకారాత్రి భోజనం దొరికింది.

ఆకలితో మా కృపా వాళ్ళు ఎంతగాధ పడుతున్నా—నాకడుపు మంటను నేను చల్లార్చుకున్నాను...

అబ్బా ! స్వార్థం ఎంతచేయిస్తుంది ?

కడుపునిండిన వెంటనే—అలసిపోయిన కన్నులుకూడా నిముటంలో సొలసిపోతాయి కాబోలు...నేను నిముషంలో పవళించాన్ని మరచిపోయానో అన్నట్లు నాకనులు మూతలుబడ్డాయి...కాని పడక సరిగా పట్టనీయక—ఆ ఇనుప ఊచలనుకూడా ఛేదించుకొని ఆ దరిద్రపిశాచం ఎలావచ్చిందో—నన్ను మధ్య మధ్య లేపటం ప్రారంభించింది...నా కనురెప్పలకు తాళ్ళుకట్టి ఉయ్యాల లూగుతూఉంది.

పగలల్లా భావాలుచే బరువెక్కిన నాహృదయం—ఆ నిశాప్రశాంత సమయంలో విశ్రాంతి తీసుకుందామనుకుంది...

లభిస్తుందా విశ్రాంతి ఈనిరుపేద గుండెకు—?

సగము వాడిపోయిన నాహృదయ కుసుమాన్ని—రేకు రేకులూ విడదీయటానికి ఈదరిద్రదేవత ఎంత ప్రయత్నంచేస్తూఉంది—

మా దేహాలు సమాధులలో జీర్ణం అయ్యేవరకు ఆ తల్లికి జాలి కలగదనుకుంటాను...

ఏమిటోలెండి—దైన్యజీవనం...

నాకొకమో స్తరు మగతనిద్ర పట్టింది...

అంతలో—

నా ఖయిదు తలుపులు నెమ్మదిగా తెరువబడ్డాయి—

తల తిప్పిచూచాను...

నాహృదయం జల్లుమంది...

'ఎవరది ?'

ఎవరోవ్యక్తి నావైపు వస్తూఉన్నాడు...

నా కన్నులను నలిపి చూచుకున్నాను...

స్పష్టంగా నావంటివాడే అని గుర్తించాను...

"ఎవరది ?"

"... ..."

"మీరెవరు ?"

"నాన్నా !"

"ఆఁ"

" నాన్నా ! "

" బాబూ ! నీవేనా ! బాబూ ! రా !

నావణికే రెండుచేతులూ ఒక్కమారుగా అతనిని నాహృదయం దగ్గరకు జేర్చుకోలేకుండా ఉండలేకపోయాయి...

కదిలిపోతూ—వణికిపోతూఉన్న మా రెండుహృదయాలు—ప్రళయసముద్రంలాగ ఉద్ఘోషించాయి...

శిథిలమై—బొంగురుపోయిన—నా గొంతులోనుంచి 'బాబూ... బాబూ' అని ఎన్నిసార్లో వెలువడించి...

వణికిపోయే నాచేతులతని శరీరాన్ని ఎన్నిమార్లో నిమిరాయి... వాత్సల్యం ఒలికించాయి...నా కన్నీరు అతని శిరస్సును గంగోదకాల్లాగ పావనం జేశాయి...

మా యిరువురి ఉత్సాహం ; ఉద్రేకం ; ఉల్లాసం ; ఉత్తేజం ; ఉన్మాదం ; వర్ణించటానికి సృష్టికర్తకుకూడా వీలులేదు...

అలా రెండునిమిషాలు గడిచాయి...

" నాన్నా ! బయలుదేరు. "

" ఎక్కడకు ? "

" ఎక్కడ తలదాచుకుంటానికి వీలుంటే అక్కడకు. "

" ఎవరైనా చూస్తే... "

" ఎవరూ చూడలేరు... చూచినా పట్టుకోలేరు...ఆ యేర్పాటులన్నీ నేను చేశాను... "

" పారిపోయి ప్రభుద్రోహి కావటం ధర్మమా ! "

" క్షణం అపహరించని నీకీ కఠినశిక్ష న్యాయమా ? లే నాన్నా ! లే. ఈవిషయం తెలిస్తే నేనూ తప్పించుకొని వచ్చేస్తాను. "

" ఇంతకష్టం నీకు. "

" ఇది కష్టమా ! పద నాన్నా పద... కాలం గడవకూడదు "

" అయినా బాబూ ! వయసు గడచినవాడిని. సుఖదుఃఖాలు అనుభవించినవాడిని...ఇంకా లేనిపోని " జీవితాశ " నాకెందుకు ? ఇలాగే నాజీవయాత్ర ముగించనీయి—"

" నాన్నా ! ఈప్రపంచంలో ఎవరు చనిపోవాలనుకుంటారు జీవితం మధురం. ప్రపంచం ఆనందమయం. జీవితాశే మానవ హృదయాకాశంమీద వెలిగే మహాజ్యోతి "

" అవును జీవితాశే అన్నిపనులూ చేయిస్తుంది "

" నాన్నా ! ప్రతిపనిమీదా ఏవో ఒకటి రెండు ప్రాణాలైనా ఆధారపడకుండా ఉండవు—వాటి గురించయినా మన ప్రణయ బంధాన్ని త్రెంచుకోలేం—మన జీవితాశను త్రుంచుకోలేం. "

" అవును "

" అందుచేత పద...నాన్నాపద...

" నాకన్నుల యెదుట కృప తన పాపాయికి పాలుసంపాదించ లేక కన్నీరు కారుస్తూ ఉన్నట్లుంది. దానితో నా హృదయం చలించి పోయింది.

కృప...పాపాయిగురించి బ్రతికింది...

నేనో—వారిద్దరగురించి బ్రతకాలి...

పారిపోవాలి...పారిపోవాలి.

ఒక నిశ్చయంలోకి వచ్చేశాను.

మాట్లాడకుండానే అతని వెనక బయలు దేరాను.

" ఒక్క పోలీసుకూడా నాదగ్గరలేరే "

" అప్పుడే పనికల్పించి పంపించాను. మీరు త్వరగా పారిపోవాలి"

" మళ్లీ మనం కలుసుకుంటం "

" త్వరలోనే " .

" అయితే... "

" శలవు...నమస్కారం... "

" మంచిది. నాయనా... "

నేను వెళ్ళిపోతున్నాను.

నావంక అలాగేచూస్తూ. పాపం ఆ చీకటిలో నిలబడిపోయాడు.

* * *

గాలికి కొట్టుకుపోయే కారుమేఘంలాగ, ఆకారు చీకటిలో తూలిపోతూ వెళ్ళిపోతున్నాను...పాపాయిని తలుచుకుంటూ ఉంటే నక్షత్రాలిలబట్టి ప్రయాణంచేసే నావలాగ...నేను నా గమ్యస్థానానికి వెళ్ళిపోతూ ఉన్నాను.

" పాపాయికి పాలులేక ఏమీ ప్రమాదం కలగదుకదా !"

అనుకొనే సరికి నాకాళ్ళు మరీతీవ్రంగా కదిలిపోయాయి.

వెళ్ళిపోయాను...వెళ్ళిపోయాను.

మా యిల్లు జేరాను.

తలుపులు వేసిఉన్నాయి.

"కృపా! కృపా!"

"... ... ..."

"కృపా!"

"ఎవరది?"

"నేనే!"

"తాతగారూ;"

"ఆ...త్వరగా తీయాలి"

ఆమె ఆతృతతో తలుపుతీసింది.

"కృపా! పాపాయి బాగుందా?"

"మీ దయవల్ల నిన్న మా స్నేహితురాలొకామె కనబడితే ఒకరూపాయి తీసుకున్నాను—"

"పోనీలేతల్లీ! దిక్కు లేని వారికి దేవుడేదిక్కు"

"అవును తాతగారు...అయితే మీరు నిన్నెక్కడికి వెళ్ళారు"

"ఖయిదులోకి"

"ఆదేమిటది?"

"దొంగతనంచేయబోయి-చేతకాక ఖయిదులో పడ్డాను"

"వారు నిర్దోషి అని గ్రహించి వదిలిపెట్టారా?"

"లేదు...దోషిననే"

"ఆదెలా?"

"నా పుత్రుడొచ్చి నన్ను విడిపించాడు"

"మీ పుత్రుడా...ఎవరది?"

"ఆవిషయాలన్నీ తరువాత చెబుతాను ముందు పాపాయినెత్తుకొని బయుయిదేరుతల్లీ?"

"ఎక్కడకు?"

"మన తలలు ఎక్కడ దాచుకుంటానికి వీలైతే అక్కడకు"

"పారిపోవటమేనా?"

"ఇంకో మార్గం ఏముంది? లేతల్లీ! లే...ఆలశ్యానికి—ఆలోచనలకు ఇది సమయంగాదు...త్రాచుపాముల్లాగ పోలీసువారు లాటీలతో మరుక్షణానికి తయారౌతారు..."

"అలాగే"

ఆమె నిదర పోయే పాపాయిని భుజంమీదకు ఎత్తుకుంది.

నాకు ముఖ్యమనితోచిన వస్తువులన్నీ మూటకట్టి తలమీదపెట్టుకొని బయలుదేరాను.

నేను ముందు వెళుతునాన్ను.

నావెనుక, పాపాయితో కృపవస్తూఉంది.

శరీరాన్ని విడిచివెళ్ళే ప్రాణంలాగ...నేను నాయిల్లుని విడిచి వెళ్ళిపోతున్నాను.

ఎక్కడకు?

ఎవరాశ్రయం ఇస్తారు?

నన్ను విడిపించిన నా కుమారుని గతిఏమిటి?

మాగతి ఏమిటి.

అలాగే వెళ్ళిపోతున్నారా...

టిక్కెట్లు లేకపోయినా రైలెక్కేశాం. అబ్బా! జీవితాశ ఎంత గొప్పది.



# 6

అది బొంబాయి మహానగరం.

మేము నానా అవస్థలుపడి ఎల్లాగైతేనేం బొంబాయినగరం చేరుకున్నాం...అక్కడ మాత్రం చేయిచాస్తే అన్నపూర్ణ పళ్ళెం చేతిదగ్గరకు వస్తుందా...వస్తే మాత్రం దానిలో అన్నం ఉంటుందా ?

ఇప్పుడు చేయవలసిన పని ఏముంది ?

ఇంటింటికీ తిరిగి ముష్టెత్తటం.

సగం కడుపుమాడి, సగం కడుపు చల్లారిన మేము—చావలేక బ్రతకలేక తిరిగే జీవచ్ఛవాల్లాగ, కాలం గడుపుతూ ఉన్నాం.

అటువంటి దుర్భర విషాదజీవితం ఎంతకాలం గడపగలం ?

ఒకనాటి రాత్రి—

పాపాయిని ఉయ్యాలలోవేసి ఊపుతూంది కృప.

ఊపుతూ ఊరుకుందా ?

సన్నని గొంతుతో, తీయనిగీతం ప్రారంభించి—పాపాయిని నిదర పుచ్చుతుంది. ప్రతిపాదం, భావం గ్రహిస్తే హృదయ దళనంగానే ఉంది...

"ఏడవకు ఏడవకు
వెఱ్ఱి నా పాపాయి;
ఏడిస్తే నీకడుపు
మంట చల్లారేనా?
జో-జో- ॥ఏడవకు॥

కన్నీటితో నీకు
పన్నీరు జల్లాను;
కటిక నెత్తుటితోన
కాటుకనుదిద్దాను;
జో-జో- ॥ఏడవకు॥

మండు వేసవిలోన
ఎండిపోయెను గుండె;
ఎండిపోయిన గుండె
మండిపోకుండునా?
జో-జో- ॥ఏడవకు॥

కమిలిపోయిన గుండెపై
కదలిపోయెను రథము;
రథము క్రిందనె ప్రాణాలు
శిథిలమయ్యాయా
జో-జో- ॥ఏడవకు॥

ఆ భావాను గుణమను 'పున్నాగవరాళి' రాగంతో పాడు తూఉంది.

ఆపాటతో పరవశం పొంది—ప్రపంచకాన్నే మరచిపోయింది. కడుపు మండిపోయిందేమో...కన్నీరు గారిపోయాయి...ఆ కన్నీటి కాలువలో ఆమె జీవితం పిల్లకాలువలై కలసిపోయింది.

అభాగిని హృదయం ఎడారి.

అందు వర్షించేది కనకవర్షంకాదు ; హిమవర్షంకాదు ; మధు వర్షంకాదు ; అమృతవర్షంకాదు ; మరేమిటి ?

భగభగామండే—అగ్నివర్షం ;

ధగ ధగామెరిసే—ప్రళయజ్వాలలు ;

భుగ భుగపొంగే—కఠోర విషజ్వాలలు...

మా కృప ఉయ్యాల ఊపుతూనే ఉంది...

పాపాయి తలపైంకన్నీరు కారుస్తూనే ఉంది...

కన్నీటిలో పాపాయిని స్నానం చేయిస్తునే ఉంది...

అప్పటికి రెండు పూటలనుంచీ మాకు భోజనం లేదు.

ఆమెరు చూస్తూఉంటే నా హృదయం ఆగిపోయింది.

బండ బారిపోయింది...మొండికి త్రిలా గయిపోయింది...

నిమ్మదిగా ఆమె వెనకకు వెళ్ళి నిలబడ్డాను.

ఆమె నన్నుచూచి గొవ్వురుమని ఏడ్చి—నన్ను గట్టిగా కౌగలించు కొని 'తాతగారూ! మమ్మల్నెందుకు చావనీయలేదండీ!' అంటూ వెక్కి వెక్కి ఏడ్వటం ప్రారంభించింది.

నే నామెను చూస్తూ బ్రతికి, ఎదుట ఎలా నిలబడగలిగానో నాకే అర్ధం కావటంలేదు...

అంతలోనే నాకెక్కడలేని ధైర్యంవచ్చింది... ఆపదల్లోనే మానవ హృదయం ఇనుములాగో...చలించని పర్వతంలాగో నిలబడాలి. కూలిపోకూడదు. సోలిపోకూడదు...

ఆమెకు ధైర్యం చెప్పాలనుకున్నాను.

ఆమె హృదయానికి ఊతగా ఉండాలి...

“కృపా !”

“తాతగారు...”

“అమ్మా ! అలా కన్నీరు కారుస్తుంటే, నేనుచూడగలనా తల్లీ!”

“మీరు చూడలేరని, మీకు కష్టం కలిగించకూడదని, నా కన్నీరు నాలోనే మ్రింగుకుంటున్నాను...దానితో నా హృదయం మరీ బరువెక్కి పోతూఉంది.”

“అవును. అది సహజమే”

“అందుచేతే ఒక్కసారి ఏడ్వనీయండి...ఎల్గెత్తి ఏడ్వనీయండి వెక్కి వెక్కి రోదించనీయండి...నా హృదయానికి కట్టిక ఈ త్రాళ్ళను చితికిపోనీయండి...ఈ దరిద్రదేవత పాదాలపైన నాజీవితం బలికానీయండి...”

“ఏమి మాటలమ్మా !”

“ఇంకా ఈ బ్రతుకు బ్రతకమంటా, తాతగారూ !”

“అమ్మా ! బంగారం ఎఱ్ఱగా కాలినప్పుడే మలినం పోతుంది. హృదయం పరిదగ్ధం అయినపుడే కల్మషరహితం అవుతుంది...తల్లీ !”

చీకటి రాత్రులు రాబోయే వెన్నెలను సూచిస్తాయి ఇప్పటి లేమి రాబోయే కలిమిని సూచిస్తుంది—"

"వేదాంతంవల్ల కడుపునిండుతుందండీ!"

" ... ... ..."

"చెప్పండీ తాతగారు."

"నిండదమ్మా!"

"అందుచేత ఇప్పుడు కర్తవ్యం ఏమిటి ఇలా మలమల మాడి—ప్రాణాలు గడ్డకట్టి చచ్చిపోవడమేనా?"

"కాదు—కాదు"

"మరి?"

"అదే ఆలోచిద్దాం..."

మేమిద్దరం చాపమీద చతికలపడ్డాం

అరగంట మాట్లాడుకోలేపోయాం—

అంతలో ఆమె కన్నులలో ఒక్క సారిగా మెరుపులు మెరిశాయి.

"తాతగారూ!"

"ఏంతల్లీ! ఏ మాలోచించావు?"

"మన దరిద్రం తీరిపోయింది—"

"ఎలా?"

"తీరిపోయింది—ఇంకేమీ భయంలేదు."

"చెప్పవమ్మా? ఎలా!"

"మన వీధి చివర "కాన్వెంట్ స్కూలు" ఉంది కదూ!"

" అవును—"

" అక్కడ ఏదైనా పని దొరుకుతుందేమో చూస్తాను "

" అదా ? "

" ఏం ? బి. ఏ. చదివాను—పని ఇవ్వరా ? "

" ఈ కాలంలో—చదువుకు విలువేముందితల్లీ "

" ఏ పనీ దొరకకపోతే రెండు ప్రయివేటులయినా చెప్తాను"

" అంత కష్టపడాలా తల్లీ ! "

" కష్ట మేముందండీ ! "

"... ... ..."

" లేవండి. తాతగారు లేవండి "

" అమ్మా—"

" ఈ చీకటులు అంతరించగానే మనకష్టాలు అంతరిస్తాయి. ఉషాకాంత బంగారపు బట్టలు కట్టుకొని, ముత్యాల ముగ్గులు పెడుతూ రాగానే—నేనూ ప్రకృతి బత్తిలాగ కలకలలాడుతూ—పాపాయి నెత్తుకొని మీ ముందు పాటలుపాడుతూ ఉంటాను "

" ఏమిటీ ఆనందం ! "

" ఇదే బ్రహ్మానందం "

" అవును...ఇదే బ్రహ్మానందం. ఇదే హృదయానందం. ఇదే జీవితానందం. ఇదే ఆత్మానందం—"

అంటూ లేచిపోయింది.

పాపాయి దగ్గరకు వెళ్ళింది—

" హాలో ! బేబీ ! "

అంటూ ఉయ్యాల ఊపుతూ

"ఆనందమేగా వాంఛనీయము"

అవని బ్రతుకే ఆశావశము ;

భావిసుఖమే

జీవితాశ 'ఆనందమేగా'

అంటూ వెఱ్ఱిగా పాడటం ప్రారంభించింది...

ఏమిటో ఆ ఆనందం...ఆ నవ్వులు

"నాలో నాకొక భంగినవ్వగు, దురంతంబైన దుఃఖంబుచే" అని లక్ష్మీకాంతకవిగారు పలుకు పలుకులెంతో అనుభవైక వేద్యములు గాస్ఫురిస్తున్నాయి—

ఆహా! జీవవాహిని ఎన్ని పర్వత శిఖరాలమీదనుంచి పడిపోతూ ఉంది, ఎన్నిలోయలలోనుంచి దొర్లిపోతూఉంది...ఎన్ని చెట్లులు—ఎన్ని గుట్టలు—ఎన్ని పుట్టలు—ఎన్ని పొదరిళ్ళు ... ఎన్ని శ్మశానభూములు. దాటిపోతుందీ?



# 7

విమాన చక్రంలాగ కాలం గిఱ్ఱుమని తిరిగిపోయింది.

విషాదాశ్రువులు—ఆనందాశ్రువులక్రింద మారిపోయాయి.

చిరిగిన వస్త్రాలున్నచోట-చీని చీనాంబరాలున్నాయి...

ముష్టెత్తే మాచేతులు—పదిమందికి ముష్టి పెడుతున్నాయి.

ఆశాకిరణం—ఆనంద జ్యోతిక్రింద ప్రజ్వరిల్లిపోతూ ఉంది.

మా హృదయాకాశాలమీద—వెన్నెల వెలుగులు చలువ కాంతులను దిద్దుకుంటున్నాయి.

ఏమిటీమార్పు ?

ఇప్పుడు మాకృప 'పంతులమ్మ' అయిపోయింది...

నెలకు వందరూపాయలు...

ఒకనెలజీతం అనుకున్నాం...ఆనందంగా...

ఇవుడు రెండోనెల ఆఖరురోజు...

మాకృప సాయంకాలం జీతం తీసుకువస్తుంది...

అందుచేత పాపాయి నెత్తుకొని...ద్వారగుమ్మంముందు నిలబడ్డాను.

నాపెద్దగెడ్డం—తలా దువ్వుకొని— పెద్దలాల్చీవేసి...పెద్దపంచి కుచ్చిళ్ళువిడిచి, బెంగాలీ పద్ధతిలోకడితే...మాకృప నావంక చూచి ఎంతో ఆనందపడుతూ ఉంటుంది.

'తాతగారూ! మీరెలాగున్నారో చెప్పనా!' అంటూ—చెప్పమంటే 'టాగూర్' లాగున్నారండీ అని నవ్వేది...

మా పాపాయికి క్రొత్తచొక్కా తొడిగి ఆడిస్తూ ఉన్నాను.

అంతలో—

రిక్షాలో దిగింది దొరసానమ్మలాగ మాకృప...

"హాలో! గుడీవినింగ్! తాతగారు!"

"గుడీవినింగ్! మరమరాలు!"

"మరమరాలా...బటానీలా!"

అటూ నవ్వుతూ రిక్షాదిగింది.

ఇద్దరం లోపలకు నవ్వుకుంటూ వెళ్ళే.

నేను సావిట్లో నిలబడ్డాను...

నా పాదాలకామె అతివినయంతో మొక్కింది—

నాకామె భక్తివినయాలుచూచి కళ్ళంమ్మట నీళ్ళుతిరిగాయి.

"కృపా! లేతల్లీ!"

అంటూ లేవతీశాను—

తరువాత ఆమె జీతం వందరూపాయలు...

'ఇదిగో! మీకృపా ప్రసాదం...'

అంటూ జీతం నావద్ద క్రిందటి నెలలోలాగే చేతిలోపోసింది...

అంతకంటే కాలంతీరిన నాకు కావలసిందేముంది?

నిజానికి బిడ్డల సంపాదన తల్లిదండ్రుల చేతులలోపోస్తే వాళ్ళ ఆనందం ఎలాగుంటుందో వర్ణించటానికి కవులకుకూడా వీలు లేదనుకుంటాను—

ఇద్దరం ఎదురుబొదురుగా కూర్చుని భోజనం ప్రారంభించాం... పాపాయి కన్నతల్లి ఒడిలో అల్లరిచేస్తూఉంది...

'కృపా! పాపాయిని ఉయ్యాలలో ఉంచకపోయావా!'

'ఉ-హూ! నాచిట్టితల్లి అల్లరిచేస్తూనే ఉండాలి.'

'అలాగా...'

"చూడండీ! మా చిట్టితల్లి కళ్లెలా నీలాలలాగ మెరిసిపో తున్నాయో!"

"ఏం పొగుడుకుంటావులెద్దూ...దిష్టికూడాను,"

"రక్షరేకు కట్టానుగా."

"అయినా ఏంపిల్లమ్మ...వట్టి అల్లరిపిల్ల"

"ఏం? తాతగారిగడ్డం పట్టుకులాగిందా!"

"ఒకటేమిటి..."

"చాల్లెద్దురూ...ఎప్పుడూ మా అమ్మాయిమీదే చాడీలు చెబుతూఉంటారు..."

"సరే...సరే...అన్నంతిను..."

"మా పాపాయిని చూస్తూఉంటే చాలదూ...కడుపు నిండిపోతుందు." అంటూ పాపాయిని ముద్దులాడటం ప్రారంభించింది.

ఆహా! మాతృప్రేమ—భగవత్ప్రేమకంటే మిక్కుటమేమో!

భోజనాలయ్యాయి...

రాత్రి పాపాయితో—ముగ్గురం సినిమాకు వెళ్ళాం.

చూచాం...తరువాత 'సీషోరుకు' బయలుదేరి కూర్చున్నాం. పాపాయి తలమీద ముసుగువేసి...

ఆ సముద్రాన్ని చూస్తూఉంటే నాహృదయం ఎందుకో రెక్కలు నరకబడిన పక్షిలాగ కొట్టుకుపోతూఉంది...ఆ బాధ మరచిపోవటానికి కృపనొక పాట పాడమన్నాను...

కృపకుకూడా తనభర్త జ్ఞాపకం వచ్చాడేమో...విచారంగా కబుర్లుచెబుతూ...ఆనందభైరవి రాగంతీస్తూ పాట ప్రారంభించింది... పాపం...

ఎడద ఎడదకు జేర్చి
నిదుర పోయేవేళ
వలపు కలలలో బ్రతుకు
కలిపి వేశానే......
చలువ కాంతల మనసు
నిలిపి వేశానే......
తలుచుకొని తలచుకొని
కులికి మురిశానే ॥ఎడద॥

*  *  *  *

పడక టింటీలోన
విడువ బడినారేయి,
ఎడదపై కన్నీళ్ళు
విడిచి వైచానే
కడలి మ్రోతల కేను
కదలి పోయేవేళ,

ప్రళయ కాలము కేను
లయము వై చానే...॥పడక॥

* * * *

ఇంటింట తిరిగినే
కంటి నీటిని విడుచ,
మంటతో నాకసులు
మాడ్చి వేశారే...
పాపాయి కొక్కింత,
పాలులే వంటేను,
బాణాల పాన్పుపై
పండ బెట్టారే...॥ఇంటి॥

* * * *

మా కృప గొంతుక బొంగురుపోయింది...ఇంకేమీ పాడలేక పోయింది...ఆమె కన్నీళ్ళు ఇసుకమీద ఇంకిపోతున్నాయి...నేనక్కడుంటే ఆమె విషాదం మరింత ఎక్కువైపోతుందని, అక్కడనుంచీ ఇంటికి పోదాం లెమ్మన్నాను.

కృప మాట్లాడకుండా లేచింది—నా వెంటే బయలుదేరింది——ఇద్దరం నాలుగడుగులు వేశాం...

అంతలో మాకు కొద్ది దూరంలో ఎవరో తలమీద పెద్ద పెట్టి పెట్టుకొని సముద్రం వైపు వెళ్ళిపోతున్నాడు.

నాలాగ అజాను బాహుడు...

అతనిని చూస్తూఉంటే మాహృదయాలు జల్లుమన్నాయి.

మాగుండెలు శరవేగంగాకొట్టుకున్నాయి.

‘ఎవరది ?’

“కృపా ! ఎవరది అటు చూడు”

“అతనిని చూస్తూఉంటే నాకుభయంగానేఉంది”

మేమిలా మాట్లాడుతున్నాం. అంతలో ఆపెట్టెను. మోకాల లోతు సముద్రంలోదిగి...రెండుచేతులతో పైకెత్తి విసిరి పారవేశాడు.

జీవిత రహస్యాలను శోధించటం అంటే ఇష్టమున్న—నేనక్కడ ఒక్కక్షణంకూడా ఉండలేపోయాను.

అతడా పెట్టెను పారేసి ప్రళయకాల రుద్రుడ్లాగ—గట్టు ఎక్కబోతున్నాడు.

అతని కెదురుగా వెళ్ళి నిలబడ్డాను.

అతడు నన్నుచూచి ఈషన్మాత్రంకూడా చలించలేదు.

‘ఎవరది ?’

అతడు మాట్లాడలేదు.

“ఎవరది ?”

అతడు మాట్లాడలేదు.

“మీరెవరు ?”

“మీరో...”

“నేనా...నేను...”

“మీపేరు...”

" రామారావు... "

" ఆ...నాన్నా ? "

" ఎవరు ? బాబూ ? "

" నాన్నా...నీవేనా...ఎంతకాలానికి "

అతడు నన్ను వణికే చేతులతో కౌగిలించుకున్నాడు—అంతలో మాకృప మావద్దకు వచ్చేసింది...

" బాబూ ! ఏమిటామూట.

" అందులో నాపాపం అంతామూటకట్టి విసిరివేశాను... "

" ఇదేమిటి ! నీబట్టలంతా రక్తం లాగున్నాయే... "

" అవును...రక్తమే... "

" నిజంచెప్పు నాయనా ! ఆపెట్లో ఏముంది ? ఏం ఘోరం చేయ లేదుకదా ! "

" ఘోరమేమీ చేయలేదు...స్త్రీవధ మాత్రం చేశాను. "

" ఎవరిని ? "

" నన్ను నాభార్యాకృపను వేరువేసిన దుర్మార్గురాలను ముక్కలు చేసి... ఆపెట్టిలో పెట్టి సముద్రంపాలుచేశాను... "

ఆ మాటలు వినేసరికి మాకృప ఆశ్చర్యపోయింది...అతడ్ని తనభర్తగా ఆనమాలు కట్టింది...

" వీరా ? "

" ఎవరు... "

" నేనే కృపను...

" కృపా ! నీవేనా... "

"నేనే వీరా !"

"కృపా ! నీవేనా ! ఈపాపిని క్షమించగలవా !"

"వీరా ! ఎంతమాట !"

వారిద్దరూ ఒకరి కౌగిలిలో ఒకరు వాలిపోయారు...

"వీరా ! ఆ అభాగిని ఎవరు ?"

"గ్రహించలేవా కృపా ! మనలను వేరుచేసిన మహాపాపి ఎవరు ?"

"లీలనుకుంటాను. లీలదా అది"

"ఇంకా సంశయమేముంది ?"

"ఏమిటీ విచిత్రం...అయితే మా తాతగారెవరు ?"

"తాతగారేమిటి ? కృపా ! వీరే నీ మామగారు. నాతండ్రి గారు."

"ఆ మామగారా !"

అంటూ నావంక ఆశ్చర్యంగా చూచింది...

"అవును తల్లీ ! అవును...నేనే మీ మామగారిని..."

"మీకీ సంగతి తెలుసునా !"

"తెలుసును...నీవు మా వీరరాఘవుడు, దెబ్బలాడుకుంటుంటే మొట్టమొదట సముద్రంలో పడిపోదామని నేను వెళుతుంటేమిమ్మల్ని చూచాను..."

"సముద్రంలో పడిపోవటానికా"

"అవును ఆత్మహత్యకొరకే...తరువాత నిన్ను రక్షించాలని బుద్ధిపుట్టింది..."

"అయితే మిమ్మల్ని రక్షించిందెవరు?"

"నీభర్త—నాకుమారుడు..., సబ్ ఇనస్పెక్టర్ వీరరాఘవుడే."

"అయితే మనం ముగ్గురం ఈ కథలో మొదటనుంచీ విషాద పాత్రలనే ధరించామన్న మాట."

"అవును..."

అని మా వీరరాఘవునివంక జూచి...

"బాబూ! నీవు ఎలావచ్చావు."

"నిన్ను విడిచిపెట్టాను. ఆసంగతి తెలియగా...లీలను తీసుకొని కలకత్తాలో యుద్ధభయం అని ఇలావచ్చాం...కాని...ఇక్కడామె నన్నువిడిచి మరొకడ్ని మరిగింది, ఈవిధంగా ఫలితం అనుభవించింది."

"సరే...గడచిందేదో గడచిపోయింది. ఇప్పుడు కర్తవ్యం ఏమిటి?"

"నేను పోలీసువారి చేతులలో చావకుండా—ఈసముద్రంలో కలసిపోవటమే."

"ఎంతమాట...సముద్రంలో కలయబోయే కృప 'జీవితాశ' వలన ఆగిపోయింది... ముసలివాడనైనా 'జీవితాశ' వలనే నేను పారిపోయివచ్చాను...అటువంటప్పుడు ఉడుకురక్తం చల్లారని నీకు 'జీవితాశ' లేదు...ప్రాణ తీపిగాదూ?"

"అయితే ఏంచెయ్యమంటారు."

"ఇదిగో... ఈ పాపాయినెత్తుకో...పద...మనం ముగ్గురం పాపాయితో బయలుదేరి—ఏ కొండల్లోనో—అడవుల్లోనో—ఏ పల్లెల్లోనో జీవిద్దాం...పద...పద..."

"మంచిది...కృపా...నీఉద్దేశం..."

" నాదీ అదే ఉద్దేశం..."

" అయితే పదనాన్నా ! "

" ఇదిగో నీర క్తపుగుడ్డ లానముద్రంలో వేసేయి—నాపయిమీద కండువాకట్టుకో...చొక్కా వేసుకో...పద..." అతడలాగే చేశాడు.

అబ్బా ! ప్రాణం ఎంతతీపి " ప్రాణభయం " ఎంత భయంకరం.

" జీవితాశ "లో ఎంతశక్తిఉంది...ఎంత గొప్పది...

మా నాలుగుప్రాణాలు కదలి వెళ్ళిపోతూఉన్నాయి...అంతలో పోలీసుల " విజిలులు " వినబడ్డాయి.

" జీవితాశ " తొందరపెట్టింది.

అంతే.

శక్తికొలదీ పరుగెత్తేం.

పారిపోయాం.

ఎక్కడకు ?

ఎంతదూరం ?

ఎక్కడ విశ్రాంతి దొరికితే అక్కడకు ?

ఇప్పుడు మేము హాయిగానే ఉన్నాం. ఆనందంగానే ఉన్నాం.

ఎక్కడ ?

అమ్మయ్యో ! చెబుతే పోలీసువారికి చెప్పరు ?

యుద్ధభయం లేనిచోట హాయిగా నేనూ మాపాపాయి, కృపా వీరరాఘవులు హాయిగాఉన్నాం. యుద్ధానంతరం ఎక్కడ్కి ఎలాగు న్నామో చెబుతాలెండి.

శలవా.

